బోజ - కవితలు
పావురాలు
మొదటి ముద్రణ 1992

ముఖచిత్రం : రామచంద్రం

ప్రచురణ: సాహితీ మిత్రులు
నల్లగొండ


ప్రతులకు
బి. చేతన్,
ప్రగతి పబ్లిషింగ్ హౌజ్
5-9-214
మాన్యం చెలక
నల్లగొండ 508 001
ఫోను నెం. 2515
మరియు
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్
(అన్ని బ్రాంచీలలోను)
హైదరాబాద్.

వెల: 15/-

గతంలో మేం ప్రచురించిన కథలు, నవల, కవితలు, సమీక్షల ద్వారా పత్రికల మెప్పును, ప్రతుల అమ్మకం ద్వారా పాఠకుల ఆదరణనూ పొందాయి.

కథలకు నాగార్జున విశ్వ విద్యాలయపు బంగారు పతకాన్ని, నవలకు తెలుగు విశ్వవిద్యాలయపు ఉత్తమ నవల అవార్డునం గెలుచుకున్నాయి అని తెలుపుటకు సంతోషిస్తున్నాము.

ఈ 'పావురాలు' కవితలు మీకు మంచిగా అనిపిస్తే మరొకరికి చెప్పండి లేదా మాకే తెలియపరచండి. ఆలోచన మాది - ఆదరణ మీది.

సాహితీ మిత్రులు, నల్లగొండ.

- ఇందులోని కవితలను క్రితంలో ప్రచురించిన వివిధ పత్రికా సంపాదకులకు
- అన్ని రకాల సహాయంపడ్డ పురుషోత్తమాచారి, పి. లక్ష్మీ నర్సయ్య, సీను, సంకోజు గార్లకు
- ముఖపత్రం గీసిన రామచంద్రం, సుశీల్ గార్లకు
- ప్రచురణ బాధ్యత వహించిన ఇ. సోములు, జి. వీరయ్య గార్లకు, నల్లగొండ
- ప్రచురించిన సాహితీమిత్రులకు

నా కృతజ్ఞతలు

బోయ జంగయ్య
చేతన కాటేజ్
నల్లగొండ, 508 001.
ఫోన్ : 2515

నిలువుటద్దంలాంటి
నిజమైన స్నేహితులు
ఆముద ఈశ్వరయ్య గార్కి
ఆత్మీయతతో ఈ 'పావురాలు'

# ఇందులో

# మరకలు

మతం మత్తులో మనిషి
రాక్షసి అయి రాళ్ళు రువ్వగ
చరిత్ర పుటల నిండా
మనిషి నెత్తుటి మరకలే!

○ అక్టోబర్ 1984

# పాలోడు

వేరు పడదామని
పోరు పెట్టుకున్న
వీధిన పడి
విమర్శించుకున్న
ఉప్పెనలో మీ యిండ్లన్ని
తెప్పలుగా తేలినపుడు
గుండె చెరువైంది
వరదల్లో మీ పంట పొలాలు
బురద పాలైనప్పుడు
కళ్ళు అలుగులైనై
ఎవ్వరం ఎక్కడున్నా
భాషాబంధం గల
ఒకే తల్లి బిడ్డలం

○ నవంబర్ 1980

# చేతులు

మొగ్గలు దేవునికి
అర్పితం అనంగానే
చెట్లు తలలు వంచాయి
వనమంతా కరతాళ ధ్వనులు
తరతరాల మూఢ నమ్మకం
అందర్నీ ఆశీర్వదించింది
వసంతానికి పులకించి పుష్పించి
బతుకు పండించుకోవలసిన
రంగు రంగుల పూరేకులను
ఒక్కొక్కటే త్రెంచుకున్నాయి
ఎన్నెన్నో చేతులు
దైవం పేర అందమైన బతుకులు
అర్ధాయుష్షుతోనే వాడి పోగా
పూజకు పనికి రాని పూలని
విసిరి పారేస్తున్నై
అవే చేతులు
అయినా బొమ్మలను నమ్ముకుంటే
బతుకు బజారు పాలు కాదూ?

○ మే 1985

# కన్యాదాత

డబ్బిచ్చేవాడు
దాత
భూమినిచ్చేవాడు
ధర్మదాత
అన్నీ యిచ్చి
బిడ్డనిచ్చేవాడు
ఉష్
గడ్డిపోచ !

○ నవంబర్ 1986

# గుర్రపు కళ్ళెం

రారాజులను మోసి- చూసిన
రణరంగంలో నిలిచి గెలిచిన
కరెన్సీ నోట్ల జంపఖానాపైన
పరిగెత్తే నా పాదాల వెంట
ఎందరివో, ఎన్నెన్నో ఆశల చూపులు
నా అడుగుల ముందు వెనకల ప్రకటనకు
ఛాయా చిత్రాల హద్దుల గుర్తులు
చేతులు మారుతున్న నోట్ల కట్టలు
అయినా నా నోట్లో మాత్రం
నాడు-నేడు కళ్ళెమే కదా!

○ నవంబర్ 1986

# అడుగు జాడలు

నిజాం నిరంకుశత్వానికి
ఎదురు నడచిన నీ పాద ముద్రలు
ఊరూరా నీవు ప్రయోగించిన
ఉద్యమ కవితా భేరి
తెలంగాణా పోరాట చరిత్రలో
కనిపిస్తూనే వుంటాయి
వినిపిస్తూనే వుంటాయి
గాలిబు గజళ్ళకు
నీవు అద్దిన తెలుగుతనం
రుబాయిల గొంతుల్లో
నీవు నింపిన తేట తెలుగు
కనిపిస్తూనే వుంటుంది
దాశరథీ! ఓ కవితా మహారథీ
అర్వై నూరేళ్ళుగా నిండినా
అవి మాత్రం చరిత్రను చెరుపలేవు
రుద్ర వీణ పలుకుతూనే వుంటుంది
అగ్ని ధార కురుస్తూనే వుంటుంది
నీ బ్రతుకు పోరాటం ముగిసినా
నీ పలుకు ఓ కవితా స్రవంతి
ధాశరధీ కవితా పయోనిధీ

○ నవంబర్ 1987

## హారతి పళ్ళెం

కోరికలు భక్తులకు
పూజలు దేవుళ్ళకు
కానుకలు ధర్మకర్తలకు
నైవేద్యం పూజార్లకు
మధ్యన నా వంటిమీద
నిత్యం మంటల కుంపటి!

○ జనవరి 1987

# ఉగాది

పండగంటేనే భయం
ఉన్నా లేకున్నా ఉత్త రోజేనయం
అప్పుల్ని చేయిస్తుంది
అదనంగా ఖర్చును పెట్టిస్తుంది
పంటల్లేని ఈ రోజుల్లో
పిండి వంటలు కావాలంటుంది
వానల్లేక నేలంతా
వట్టిపోయిన ఆవులా వుంది
ఊరలేక బావులన్నీ
ఖురదను నెమరేస్తున్నాయి
పాము పుట్టల్లో ధారగా పాలు
పాపం పసివాడి నోట్లో వేలు
ముష్టివాడికి ముద్దయినా లేదు
విగ్రహాలకి చక్కెర పొంగలి
అన్నా అనకున్నా ఉగాది
అంతో యింతో నయం
కాయలు పూలు తప్ప
ఖర్చెక్కువ లేనట్టిది
వయస్సు స్కోరు చూపించే
కాలానికి కొలమానం!

○ మార్చి 1987

# తలుపులు

పాడమంటే పాడాను
ఆడమంటే ఆడాను
ఆడిపాడి అలరించాను
అడిగిన వాళ్ళందరికి
హృదయాన్ని పరిచాను
తీరా చూస్తే నా కోసం
అంగుళం ఖాళీ లేదు
తిరిగి ప్రతి తలుపు తట్టాను
ఏ తలుపూ తెరుచుకోలేదు!

○ జనవరి 1988

# నిప్పు

మౌనం నోరుమూసుకున్నట్టు కాదు
జరిగే అన్యాయాలను లెక్క పెడుతున్నా
జరిపే అత్యాచారాల లిస్ట్ రాస్తున్నా
ఎన్ని గుడిసెల్ని తగుల బెట్టారని
ఎన్ని పుస్తెల్ని తెంపి వేశారని
కళ్ళు మూసుకోడం నిద్ర పోతున్నట్టు కాదు
అన్యాయాన్ని ఎదిరిస్తే సజీవంగా కాల్చి
చంపటాన్ని
హంతకులను అధికారం ముసుగులో
దాచటాన్ని
చూస్తున్నా, చూస్తూనే వున్నా
రెప్పల కింద నిప్పు రాజేస్తున్నా

○ మార్చి 1988

# న్యాయం

నా తాత

బానిస

నా తండ్రి

పాలేరు

నేను ఈ రెండు కాను

శ్రమకు తగ్గ ఫలితం

లేంది ఊరుకోను

కాదంటే

వాటాలు పంచు

○ జూన్ 1989

# నేను...

పుట్టుకతో పుట్టెడు అందాలను
మూట కట్టుకొచ్చిన దానివని
పెరుగుతూ ఇల్లంతా
కనువిందులను పరచిన దానివని
కన్నెగా వన్నెలను వెదజల్లిన
నిండు పున్నమి జాబిల్లివని
అందరూ అంటుంటే విన్నదాన్ని
కామం చూపుల కందిరీగల నుండీ
క్షణం క్షణం తప్పించుకుంటున్నదాన్ని
పెళ్ళి పందిరిలో చూపులు కలిసినప్పుడు
ఆనందపు తలంబ్రాలు గుమ్మరించిన దాన్ని
తల్లి తండ్రిని మరిచిపోయి
అత్తమామలను ఆదరిస్తున్నదాన్ని
కట్నం కోసం గుండెను కత్తిరిస్తున్నా
ఇంటిల్లి పాదికి చాకిరి చేస్తున్నదాన్ని
నిత్యం మంటలను వంటికి అంటిస్తున్నా
మానవ సంతతికి పురుడు పోయడానికి
ఇంటింటా వున్నదాన్ని

○ అక్టోబర్ 1989

# పంట కాలువ

మాటలను మంచినీళ్ళలాగ ఖర్చు చేసి
రూపాయలను పట్టు చీరల్లా దాచేవాడు
పంచాయితీ నుండి పార్లమెంట్ వరకు
రాజకీయాలను ప్రజలకు పాఠాలుగా
చెప్పేవాడు
పరీక్ష హాల్లో పిల్లలు కత్తి చూపిస్తే
బిత్తర పోయి చూసేవాడు
ఇంజనీరో, డాక్టరో ఎదురై
నమస్కరించి మీ శిష్యుణ్నే అంటే
ఆనంద బాష్పాలు రాల్చే పంతులు
పారుతున్న పంట కాలువ

O సెప్టెంబర్ 1989

# కరువు

మాట కరువైంది
మంచి మాట మరుగైంది
మాటల్లో నిజాయితీ తేట కరువైంది
చూపు పొగ చూరింది
మనిషికి మనిషి కన్నెర్ర
చూపుల్లో మమకారపు తీపి కరువైంది
నమ్మకం వమ్మైంది
ఒకరినొకరు నమ్మటం కష్టమైంది
నమ్మకాల్లో వుండే సమ్మతి కరువైంది
చదువు ప్రియమైంది
యువతకు అదుపు అప్రియమైంది
చదువుల్లో బతుకు దెరువు కరువైంది
ధర పెరిగింది
పెళ్ళిళ్ల సంతలో వరులకు ధర పెరిగింది
ఇచ్చి పుచ్చుకొనే పెద్దల్లో సంస్కారం కరువైంది
స్వచ్ఛత మాయమైంది
జాతి జీవితంలో
మంచి కరువైంది-మమత కరువైంది
ఇన్ని కరువైన బతుకు
మరీ మరీ బరువైంది

○ ఫిబ్రవరి 1990

# హ్రాజ్

వాడు నా గుడిసె ముందుకొచ్చి
నా పేరు పెట్టి పిలిచి
నా భుజం మీద చెయ్యేసి
నేను తినే బియ్యం
రెండు రూపాయలకే అని చెప్పి
నా ఓటు అడుక్కొని
నేను తాగే సారాను
హ్రాజ్ చేస్తాడూ?!

O ఆగస్టు1990

# అన్వేషణ

వెతుకుతున్నాను
నేను వెతుకుతున్నాను
ఒళ్ళంతా కళ్ళు చేసుకొని
కళ్ళ నిండా కాంతి నింపుకొని
వెతుకుతున్నాను
ఊరు ఊరు తిరిగి చూసినా
పట్టణాలన్నీ వెతికి చూసినా
పంజాబును పలుకరించినా
అస్సాం అంతా తిరిగినా
"పత్తా" కనిపించడం లేదు
పలుకైనా వినిపించడం లేదు
వెతుకుతున్నాను
మనిషి మనిషికి దూరం
మైళ్ళ కొలది లెక్కలు చెప్పి
మానవతనే పెకిలిస్తుంటే
మనస్సుని రగిలిస్తుంటే
కర్మ సిద్ధాంతపు దుప్పటి కప్పి
ఆలోచనలను జోకొట్టడాన్ని గమనిస్తున్నా
అంగడికి మసిపూసి

తిండిని కల్తీ చేసే
ఆధునిక వ్యాపార సంస్కృతి
విద్యాలయాల పూదోటల్లో
గంజాయి మొక్కలను నాటి
యువకులను నిద్రబుచ్చేది
చూస్తూ వెతుకుతున్నాను
ఎంత సేపటికి మాయమాటలు
ఎటు చూసినా మారీచ ముఠాలు
ఎండ మావులను చూపించి
కడవలను నింపుకొమ్మనే
పగటి వేషగాళ్ళు
ఓవ్! నీ కోసమే నా ఆవేదన
నీ గూర్చే నా పరిశోధన
నీ రూపాన్ని చూడాలని
ఓ దీపాన్ని వెలిగించాలని
కరుణను పెంచే నీ చూపు
కాంతిని వెదజల్లే నీ రూపు
ఓ మనిషీ
ఎక్కడైనా కనిపిస్తే
మోకరిల్లి నమస్కరిస్తా

O ఫిబ్రవరి 1991

# అంబేడ్కర్

దళిత వాడలో పుట్టి
పేదరికంలో పెరిగి
బడిలో చివరన
గుడికి దూరంగా
కులతత్వపు అడ్డుగీతలు
కోటి ప్రశ్నలు లేవనెత్తగ
ఎటు చూసినా అజ్ఞానం
చుట్టూరా అంధకారం
బాధలు-ఈసడింపులు
బానిస బ్రతుకుల విముక్తి కోసం
దేశాలెన్నో తిరిగి తిరిగి
శాస్త్రాలెన్నో చదివి చదివి
మానవత్వపు విలువలు పెంచి
మతతత్వానికి హద్దులు చెరిపి
నీవు కూర్చిన రాజ్యాంగం
జాతి జనుల కరదీపం
దీనులకు నిరుపేదలకు
బతుకునిచ్చిన అంబేడ్కర్
ఋణపడ్డది నీకు భారత జాతి

○ ఏప్రిల్ 1991

# అప్పుల పాలు

పాలక పక్షం
ప్రతి పక్షం
చట్ట సభలో
చీటికి మాటికి గోల
దేశ ప్రణాళికల మరిచి
పార్టీ మ్యానిఫెస్టోల రభస
బహిష్కరణలు
బల ప్రదర్శనలు
వంతులు సరిగ లేక
మధ్యంతర ఎన్నికలు
పార్టీలు పాత పాటే
ఓటర్లకు వొరిగింది లేదు
దేశం మాత్రం-

○ మే 1991

# ఎన్నికలు

ఎన్నికల్లో
ఎన్ని కల కళలు
నా రాకపోకలు కార్లల్లో
నా బస రహదారి బంగ్లాల్లో
చల్లని పానీయాలు
చక్కని భోజనాలు
మంత్రులతో కరచాలనం
అధి నాయకులతో ఆలింగనం
ఎక్కడ చూసినా జోడించిన చేతులు
గతాన్ని మర్చిపొమ్మని
రేపటి గూర్చి ఏమేమో చెపుతూ
నా చుట్టూరా ఒకటే కల కల
ఆ తర్వాత
అదో కల!

○ మే 1991

# సఫా

రూపాయిస్తే
రాయి విసురుతా
రొట్టె ముక్కిస్తే
కత్తి పోటు
సారా పోయిస్తే
సఫా!!

○ జూన్ 1991

# దిక్కు లేదు

తరతరాలుగా చదువును
సామాన్యుని చేరకుండా చేసి
ఎడ్డి వాళ్ళుగ
గుడ్డి వాళ్ళుగ
ఏమిలేని బానిసలుగ
యుగాలెన్నో గడిచిపోయె
తరాలెన్నో తరలిపోయె
రాజుల కాలం పోయి
ప్రజాస్వామ్యం వొచ్చి
పార్టీల మానిఫెస్టోలను
పదే పదే చెప్పినా
తలకెక్కని అమాయకుల
అక్షరాలు లేని మెజారిటి
దేశాన్ని పాలిస్తుంటే
మేధావులు తలవంచక
తప్పదు యిక ...

○ జూన్ 1991

# లాయల్టీస్

కలవారి సీమ కుక్క
దొంగలొస్తే కళ్ళు మూసుకుంటుంది
అయిన వాళ్ళొస్తే తోకాడిస్తుంది
అడుక్కుతినే వాళ్ళొస్తే
అరుస్తుంది!
కరుస్తుంది!!

○ ఆగష్టు 1991

# బిన్ పత్తా

దేశం వంటినిండా
అరాచకపు గాయాలు
ఆందోళనా జ్వరం
కళ్ళల్లో అశాంతి నలుసు
చెవిలో మారణాయుధాల మోత
కదిలితే భయం భయం
గుళ్ళో, మసీదుల్లో జనం
ప్రార్థనలు చేస్తూనే వున్నారు
ప్రేమ-శాంతి ఆమెన్
బైబిల్, కురాన్, గీత దాటి
మనిషి మనిషినే వేట
సందుల్లో గొందుల్లో
తుపాకి గుళ్ళు, కత్తి పోట్లు
దేవుని పత్తా ఎక్కడ?

○ డిసెంబర్ 1991

## స్త్రీ

అడవిలో తుపాకి గుండుకు
కన్నడు నేలకొరిగినా
టౌన్లో డైనమైట్ బ్రద్దలై
సోదరుడు కుప్పకూలినా
మార్గ మధ్యాన మందు పాతర పేలి
ఆయన అక్కడికక్కడే ముక్కలైనా
అది హత్య అయినా
ఆత్మహత్య అయినా
గాయాలు నా గుండెకే కదా!

○ జనవరి 1992

# నిరీక్షణ

నడుస్తున్న రాత్రిని కొలుస్తున్న ముల్లు
పడుకున్నానే కాని కంటికి కునుకు లేదు
ఆలోచనల అలల ఊపుకు మనస్సు
పల్టీలు కొడుతున్న పతంగిలా వుంది
కిటికీ తెరిస్తే చాలు రోడ్డు నిండా సమస్యలే
తాను విలాసంగా బ్రతకడానికి వాడు
ఇతరుల కళ్ళల్లో మేకులు దింపుతున్నాడు
బ్రతుకు ఉద్దేశ్యాన్ని పక్కకు నెట్టి
సహజీవనాన్ని శిలువ వేస్తుంటే
ఐదు నదులే కాదు నదీ నదాలన్ని రక్తపు
మరకలే
వీస్తున్న గాలంతా మనిషి కాలుతున్న కమురు
వాసనే
పక్క మార్చిన చెక్కు చెదరని చిక్కు ముళ్ళు
గుండెలో నుండి నిట్టూర్పు చీకటి చెట్టులా
కంపిస్తుంది
నాభి నుండి ఆవలింత వడగాడ్పు బయటి
కొస్తుంది

ఒకప్పుడు కష్టించి సృష్టించుకున్న నిప్పు
ఇప్పుడు రూపాంతరమై ప్రకృతిని ధ్వంసం
చేస్తుంది

కళ్ళు మూసుకున్నా కలతల కలగాపులగం
ఎదురుగ ఉదయపు ఊరేగింపు పిడికిళ్ళు
ఊపిరి పీలుస్తున్న యెద ధర్నా డేరాలా
కదులుతుంది.

తెరచిన తలుపుల్లా కనురెప్పలు
జైల్లో అందరూ హాజరే కాపలావాడి కూత
వీధిలో కుక్కా విషాదంగా ఏడుస్తోంది
కంటికి నిద్ర రాదిక తెల్లవారే దెప్పుడో?

○ జనవరి 1992

# ద్వంద్వం

అహింసను గూర్చి చదువుతున్నాం
హింసను చూస్తున్నాం
సోషలిజం గూర్చి వింటున్నాం
"టాటా" ఉప్పును కొంటున్నాం
రాం రహీం ఒకటే అంటున్నాం
తూర్పు పడమరగా వుంటున్నాం
చట్టాన్ని గౌరవించాలంటున్నాం
చుట్టానికి బొట్టు పెడుతున్నాం
సినిమాలు చూసి ఏడుస్తున్నాం
బతుకులు చూసి నవ్వుతున్నాం
ఇరుగు-పొరుగును ప్రేమించాలంటున్నాం
ఇల్లు వాకిళ్ళ దగ్గర పోరు పెట్టుకుంటున్నాం
ఓటును రహస్యంగా వేస్తున్నాం
బహిరంగ రిగ్గింగ్‌ను చూస్తున్నాం
ఆరోగ్యమే మహాభాగ్యం అంటున్నాం
కల్తీ సరుకుల అంగడిలో చిక్కుకున్నాం
ఇదేమిటి
ఆలోచన ఒకటి
ఆచరణ వేరొకటి?!

○ మార్చి 1992

# వేట

నిజం చెపుతూ నడిస్తే
గజ గజానికో గండం
అందరం బతకాలి అంటే
అడుగడుగున ఆపద
సంపద వేటలో మనిషి
వంచనా పరుడు అవుతున్నాడు
దౌర్జన్యం వెంటాడుతూ వుంటే
నగరం అరణ్యం అవుతుంది
చూస్తూ చూస్తూనే చుట్టూరా
శూన్యం కొడి గట్టుకుంటుంది!

# చదువు

ఎన్నాళ్ళనుండో నన్ను
గుడిలో ఘడిలోనే
సంకెళ్ళు వేసి బంధించగ
దేశం అధోగతి పాలాయె
యిప్పటికి కోలుకోదాయె
ప్రపంచపు పరుగు పోటీలో
కుంటి వాళ్ళుగనే గెంటుతున్నారు
ఋషులు పుట్టిన పుణ్య భూమని
ఆ మత్తులోనే మసలుతున్నారు
ఎవడు పన్నిన పన్నాగమది
ఏ స్వార్థం విసిరిన చీకటి వల యిదీ?
బతుకును పంచాంగ కర్తల కొదిలేసి
నిత్యం మెతుకుల కోసం పోరాటం
ఆలస్యంగానైనా నేను
మీ వాకిళ్ళలోకి వచ్చి నిలుచున్నాను
అక్షరాలను వెదజల్లుతున్నాను
అమాయకులారా ఏరుకోండి
మీ బతుకుల్లో వెలుతురు నింపుకోండి

○ మార్చి 1992

## మరవకండి

వయస్సు మళ్ళి
చూపు తగ్గి
చేత వూత కర్ర
పగిలిన కళ్ళద్దాలు
"వందేమాతరం"
లాటి దెబ్బలకు
"క్విట్ ఇండియా"
బూటు తన్నులకు
ఎముకలు విరిగి
వంగి నడిచే వంటరి
మీకు కనిపిస్తే
పలకరించండి
మరవకండి
అతను తిన్నాడో
వస్తున్నాడో కనుక్కోండి
ఆయనే
స్వాతంత్ర్య సమరయోధుడు
(ఈ కవిత పెన్షన్ మంజూరీ కాని వాళ్ళ జ్ఞాపకార్థం)

○ ఆగష్టు 1992

# వసుదేవ పూజితం

మా తాత ఖజానాను మోసాడట
మా తండ్రి క్రీస్తునే మోసాడట
అర్ధరాత్రి మా కాళ్ళు పట్టుకుంటేనే కదా
మీ దేవునికి ప్రాణభిక్ష పెట్టింది
నేను మాత్రం ఊరుకుంటున్నానా
ఊరు వాళ్ళ బరువంతా మోస్తూనే ఉన్నా
గడ్డో - గాదమో మేస్తూ వున్న
కాకుంటే కాయితంతో సరిపెట్టుకుంటున్న
నా దారిన నేను నడుస్తు వున్న
ఏదో ఓ గేటు కాపలా కాస్తున్న నీవు
నన్ను చూసి మొరుగుతావెందుకు?
నా వెనక్కాళ్ళకు పని చెప్పవలసి వస్తుంది.

○ జనవరి 1986

# కన్నెర్ర

పంట పొలాలు, పళ్ళ తోటలు
తండ్రి తరువాత తనయునికాయె
టాటా, బిర్లాల కోటాన కోట్లు
మనవలకు, మునిమనవలకాయె
గనులు, కార్ఖానాలు
బంగళాలు, బంగారపు నగలు
రాజకీయాలు, మంత్రి పదవులూ
అన్నీ వారసత్వపు ఆస్తులైనప్పుడు
పాతికేండ్లు వూడిగం చేసి
ఉన్న ఉద్యోగం వదులుకోగా
మావానికిచ్చేది గుమాస్తో, బంట్రోతో
అదీ వద్దంటు కన్నెర్ర జేస్తారెందుకు?

○ సెప్టెంబర్ 1992

# ఆదిత్యులు

ఏమిటా చప్పుడు
"ఏడుపులు–పెడబొబ్బలు
ఆ తగలబడేవి
"దళితుల గుడిసెలు"
ఆ వీధుల్లో పారేది
"అది వాళ్ళ రక్తమే"
ఓవ్ ఎంత దౌర్జన్యం
ఎంతటి నరమేధము
వాళ్ళెవరో కాదు
ఈ దేశపు ఆదివాసులు
ఈ నాగరికతకు మూలజనులు
అంతేకాదు–
పంటలు పండించేది వాళ్ళే
పాడె కట్టెలు తెచ్చేదీ వాళ్ళే
వాళ్ళే తిరగబడితె
ఊళ్ళకు ఊళ్ళే ఉప్పెనలై లేస్తాయి
దేశ చరిత్ర మారిపోతుంది సుమా!

 అక్టోబర్ 1992

# పరాయీకరణ

అమ్మా తమ్ముణ్ణి చూడు
అన్ని తప్పుడు పనులే-
వాడు గోరుముద్దలు మింగలేకపోతే
నీళ్ళు తాగించి వీపు నిమిరాను
బడికెళ్ళేటప్పుడు జారిపడితే
లేవనెత్తి, వాడి పలకను మోశాను
తినేవి ఏవైనా వాడికి ముందేయిచ్చి
ఆ తరువాతనే నేను తీసుకున్నా
ఆటపాటలపుడు వాడు నాచుట్టే
పెద్దైనాక వానిబుద్ధే మారింది
పెళ్ళైనాక మనిషే మారిపోయిండు
చిన్నచిన్న వాటికి కొట్లాట
వున్నదంతా తనకేనని పోట్లాట
నేను అలసి సొలసి పడుకుంటె
పరాయివాడిలా తప్పుకపోతాడు
నీవు, నాన్న మోయలేని బరువట
తనపిల్లలు తీగెకున్న కాయలట
అక్కలు చెల్లెండ్లు అందరు దూరం
అత్తింటి చుట్టాలరాక వారం వారం
మమ్ముల ఇద్దర్ని పెంచింది నీవేకద
వాడు ఎందుకెట్ల అయినట్టు?

○ నవంబర్ 1992

# రోడ్డు

రోడ్డు ఓ తెరిచిన పుస్తకం
చదివే కళ్ళుంటె అన్ని కథలు గాథలె
భూమ్మీద వాలిన పావురాల గుంపులా
ఊరేగింపు విసిరిన కరపత్రాలు
వాటినిండా నినాదాలు, డిమాండ్లు
నిరాశ పాదాలలో నిస్సత్తువ నింపగా
ఎందరు నిరుద్యోగులు నడుస్తున్నారో
అన్నీ చిరునామాలేని పాదముద్రలే!
ఎన్ని వాహనాలు ఎంతమోసాన్ని
దాచుకుని మోసుకపోయాయో
ఇరుపక్కల రహస్య సంకేతాలే
ఎవరూ పట్టించుకోని అరాచకం
ధ్వంసం చేసిన శిధిలాలు
ఎటుచూసినా కుప్పలు కుప్పలు
బిచ్చమెత్తి జరిపిస్తున్న
అనామకుని శవయాత్రలో
చల్లిన మరమరాలు చిల్లర నాణాలు
ఏ అవినీతి యిచ్చిన లైసెన్సో
రక్తం మడుగులో మనిషి
పక్కనె కూర్చొని చూస్తున్న కుక్క
రోడ్డు ఓ పుస్తకం

○ నవంబర్ 1992

# కొత్త ఆశ

నా నమ్మకాలను
నా స్వాతంత్ర్యాన్ని
హరించి వేస్తున్నారు
నా ఆలోచనలను
నా చూపులను
దారి మళ్ళిస్తున్నారు
నా ఏకాంతాన్ని
నా మౌనక్షణాలను
భంగపరుస్తున్నారు
నా రాకపోకలకు
నా కదలికలకు
రాస్తారోకో
నా అవసరాలకు
నా పనిపాటలకు
రోజుకో బంద్
నా మాటల మీద నిఘా
త్రాగే నీరు
పీల్చే గాలి గగనమై పోయె

మనసారా నవ్వుకునే
సంభాషణే అరుదై
చుట్టూరా పగల సెగలు
అదుపు తప్పిన విశ్వాసాలు
పెరుగుతున్న పరాయితనం
వొంటరిని చేస్తున్నాయి
చెదిరిపోయే కలలకు
కాపలా కాస్తూ
బెదిరి ఎగిరిపోయిన పావురం
తిరిగొచ్చే వరకూ
సరికొత్త ఆశలతో
ఎదురు చూస్తుంటాను.

○ నవంబర్ ' 92

# చిత్రం

కనుచూపు మేర సముద్రం
ఆశల అలలపై ఆకలి వల
జాలరి చూపుల కాపల
పేకలు రూకలను గెలిచే చోట
నాలుకలను నిశాలో ముంచి
కాలాన్ని కర్పూరంలా కాల్చే
ఈ క్లబ్ గదుల్లో
ఆ బతుకుపోరు చిత్రం
విచిత్రం !

○ నవంబర్ ' 92

# డిసెంబర్ '92

కిటికీ తెరిస్తే
ఎక్కుపెట్టిన తుపాకులు
తలుపు తెరిస్తే
పైనబడే లాఠీలు
నలుగురు కలిసి నడిచేది లేదు
రాత్రింబగళ్ళు యిళ్ళల్లో
బలవంతపు బందీలు
ఉదయం వాలిన వార్తల్లో
తగలబడుతున్న నగరం
రాత్రి టి.వి. తెరనిండా
రక్తసిక్తమైన దేశపటం
ఈ సంవత్సరాన్ని ఎలా మరిచిపోవటం
వచ్చే సంవత్సరానికి
ఏమని స్వాగతం చెప్పటం

○ డిసెంబర్ ' 92

# PUBLISHER'S NOTE

## మా కథ

పదిహేను ఏళ్ళ క్రితం నల్లగొండ లో ఏకాభిప్రాయంగ కొందరం కలిసి "సాహితీ మిత్రులు, నల్లగొండ" అనే సంస్థను స్థాపించాం. సాహితీ సమావేశాలను నిర్వహించడం, సాహితీ మిత్రుల రచనలను, కథలను సంకలనాలుగా ప్రచురించడం, మా సంస్థ యొక్క ఉద్దేశ్యాలు.

## మా ప్రచురణల కథ

1970 ఆ ప్రాంతంలో మొదట "దర్పణం" త్రైమాసిక పత్రికను వెలువరించాము. దానికి శ్రీ కాంచనపల్లి చిన వెంకట రామారావు గారు సంపాదకులు. ఆరోజుల్లో పత్రిక చాలామందిని ఆకర్షించింది. సంచలనాన్ని సృష్టించింది.

1980 "గొర్రెలు" కథా సంకలనాన్ని ప్రచురించాం. ఆ పుస్తకానికి ఆ పేరు బాగా కుదిరిందని తర్వాతతర్వాత గాని తెలియలేదు. అంతే కాకుండా సుప్రసిద్ధ రచయిత శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రి గారు దీనికి పరిచయ వాక్యాలు వ్రాయడం ఓ విశేషం. ఈ పుస్తకం కౌలాలంపూర్‌లో జరిగిన రెండవ ప్రపంచ తెలుగు మహాసభ నుండి విడుదల చేయబడటం అక్కడి తెలుగు సోదరుల మన్ననను పొందటం అనుకోకుండా లభించిన ఓ మంచి అవకాశం. ఆ తర్వాత 1983 "ఎచ్చరిక" కథలను ప్రచురించాం.

ఆంధ్ర దేశంలోని ప్రముఖ పత్రికలు, పాఠకుల ముందుంచిన కొన్ని సమీక్షలను మీ ముందుంచుతున్నాం.

"కథలు ఆకాశంలో పుట్టవు మనిషి జీవితంలోంచి పుడతాయి. అందుచేతనే రచయిత జీవితానికి దగ్గరగా వుండాలి. జీవితానికి దగ్గరగా వుండదగిన వారే మంచి రచయితలుగా మిగులుతారు" రా.వి. శాస్త్రి గారి ఈ మాటలకు జంగయ్యగారి ప్రతి కథా మంచి ఉదాహరణ.

ఆంధ్రపత్రిక — టి. ఎల్. కాంతారావు.

"ఈనాటి వాస్తవికతకు ముఖ్యంగా తెలంగాణా గ్రామాల్లో జరుగుతున్న ఘోరాలకు ఈ కథా సంకలనం ప్రతిబింబం. అభూత అసందర్భ కల్పనల్లోంచి, అవాస్తవిక ప్రపంచంలోంచి, దెయ్యాల, భూతాల క్షుద్ర సాహిత్యం తెలుగు రచన బయటపడి పునర్జీవించడానికి ఇలాంటి సంకలనాలు ఎన్నైనా రావాలి.

భారతి, మాసపత్రిక

"జీవితాన్ని బాగా చదివినవారే ఇటువంటి ఉత్తమ కథలు రాయగలరు. వీటిని చదువుతున్నప్పుడు వొళ్ళు జలదరిస్తుంది."

రా. వి. శాస్త్రి.

"గొర్రెలు సంపుటితో తెలంగాణా పీడిత తాడిత జనాన్ని పరిచయం చేసిన బోయ జంగయ్య "ఎచ్చరిక" మరొక సంపుటాన్ని పాఠకులకు అందచేశారు. బోయ జంగయ్య ఒక సంపుటికి మరొక సంపుటికి పెరుగుతూ ఉన్న రచయితలా ప్రత్యక్షమవుతాడు. ఇతని క్రాన్ ఉపమానాలు ఈయన కథ వస్తువుకు పదును పెట్టేవిగా ఉంటాయి. ఒక అవినీతి గూర్చి చెబుతూ మరొక వ్యవస్థలోని దానితో పోల్చి, చివరకు ..న్ సర్వీన్ దాక పోయి మొత్తం గంపంతా కుళ్ళిన సరుకేనని తే..వేస్తాడు. బాధితుల దురవస్థను దీనంగా, జాలిగొలిపే

విధంగా చిత్రించి అంతటితో వదిలివేయడు. వాళ్ళకు కనువిప్పు కలుగుతోందని, వాళ్ళలోంచి సూర్యుళ్ళు పుట్టుకొస్తున్నారని, వాళ్ళ బ్రతుకుల్లో పొద్దు పొడవనున్నదని నేటి సమాజాన్ని తగు మాత్రం ఎచ్చరించడం ఈ సంపుటిలోని ప్రత్యేకత".

ఆంధ్రప్రభ — డి. రామలింగం

" కథల్లో జీవిత చిత్రణ ఉంది. ఓ లక్ష్యం, ఓ సూత్రం రన్నవుతుంది. ఈ వ్యవస్థలో ఎవరైతే బాధపడుతున్నారో వాళ్ళ బాధల్ని యాక్చువ్‌గ రశారు అని రా.వి.శాస్త్రి గారి సర్టిఫికేట్ అందుకున్న బోయ జంగయ్య గారి ఐదు కథల సంపుటిని ప్రచురించిన సాహితీ మిత్రులు అభినందనీయులు".

ఈనాడు దినపత్రిక

మీరాసిన "ఎచ్చరిక" చూచాను. గ్రామీణ జీవితంలో సంఘటనలు ఆనాటి పోరాటాలు గడిచిపోగా, ఈనాడు సమాజంలో చిన్న చిన్న వర్గాలు అనుభవిస్తున్న అవస్థలు సామాజిక పరివర్తనలో అనుదినం అనుభవిస్తున్న కష్టాలు కళ్ళకు కట్టినట్లుగా చూడగలిగాను. చదివాను.

28-8-85 — అభినందనలతో

సత్తెనపల్లి — -వావిలాల గోపాల కృష్ణయ్య

ఈ ఎచ్చరిక కథకు 1984 లో శ్రీ శ్రీ స్మారక బంగారు పతకాన్ని నాగార్జున విశ్వ విద్యాలయం వాళ్ళు బహూకరించారు. అప్పటి నుండి మా కథలు బంగారు కథలయ్యాయి. ఆ తర్వాత 1985 లో వెలుతురు కవితా సంకలనాన్ని ప్రచురించాం. కవితా సంకలనం గూడా ఎంతో ప్రశంశలను అందుకుంది.

"జూన్ 1976లో నల్లగొండ సాహితీ మిత్రులు బోయ

జంగయ్య కవితా సంకలనం, నడుస్తున్న చరిత్ర, ప్రకటించారు. అప్పుడే నడుస్తున్న చరిత్రను సాంతం చదివి సంతోషించాను. నడుస్తున్న చరిత్రలోని ఖండికలు పద్దెనిమిది, పుటలు ఇరవై, ఆనాడే అన్నాను వ్యాసుని నాటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలు, నేటి మహాకావ్యం పద్దెనిమిది పుటలు అన్న శ్రీ శ్రీ మాటకు 'నడుస్తున్న చరిత్ర' జంగయ్య కవితా సంపుటి నిదర్శనమని, నాకట్లా అనిపించింది.

ఈనాడు "వెలుతురు" చిందిస్తూ జంగయ్య మరో కవితా సంకలనం మన ముందుకు వస్తున్నది. వెలుతురు జాడగని నా గొడవ కొక్కొరకో అంటున్నది.

హనుమకొండ - కాళోజి

ఇన్నాళ్ళుగా కథలు నడిపిన జంగయ్య ఇప్పటికి కవితా సంపుటి తీసుకొస్తున్నాడు. ఈ సంపుటిలో వున్న చాల కవితలు ప్రత్యక్షంగా చూసిన సత్యానికి కట్టిన చిత్రాలు.

కథా రచనలో జంగయ్యకు బలమైన గొంతు ఏర్పడింది. కవితల్లో కదిలించే గుండె కదను తొక్కింది. పలుకూ పదునూ కాపాడుకుంటూ జంగయ్య మరిన్ని చక్కని కవితలు వ్రాయాలని కోరిక. బోయ జంగయ్య 'వెలుతురు' కు ఇదే నా ప్రసరణ.

19-2-86 సి. నారాయణ రెడ్డి

హైదరాబాదు వైస్ ఛాన్సలర్, సార్వత్రిక విశ్వవిద్యాలయం

తర్వాత 1988లో "జాతర" నవలను ప్రచురిస్తే, దానిని మైసూరు విశ్వవిద్యాలయం వాళ్ళు బి.ఎ. ఇడి. కి ఉపవాచకంగా ఎంపిక చేశారు. అంతే కాదు తెలుగు విశ్వవిద్యాలయం వారు 1989 సం॥పు ఉత్తమ నవల అవార్డును గూడ బహూకరించారు. దానికి ముందు మాట రాస్తూ -

"జీవితం గురించి బాగా తెలిసి రాసే అరుదైన రచయితలలో బోయ జంగయ్య గారు ఒకరు. ఆయన అర్బన్ రచయిత కాదు 'జాతర' నవల ఆయన ప్రతిభకు ఒక మచ్చుతునక.

ఈ నవల గ్రామీణ జీవితానికి అద్దం పడుతూ వారు ఎలా పూజీరి వర్గం దోపిడికి గురవుతున్నారో స్పష్టంగా చూపిస్తుంది. ఇందులో సిద్ధాంతాలు, స్లొగన్లు, చర్చలు వాదోపవాదాలు ఏమీ లేవు. కథ ప్రవాహ సదృశంగా సాగిపోతూ జీవిత సత్యాను ఆవిష్కరించి మూఢ నమ్మకాలను పటాపంచలు చేస్తుంది. అంతకంటే సాంఘిక ప్రయోజనం ఏమికావాలి? రచయిత స్థిత ప్రజ్ఞుడు. దేన్ని ద్వేషించడు. ఎవర్నీ తిట్టడు, ఉన్నది వున్నట్లు చెప్పాడు, వీరైతే కాదు, తప్పకుండ మన సమాజం ఇటువంటి దురన్యాయాల నుండి దుష్టసంప్రదాయా నుంచి బయటపడాలి. ఈ సందేశం కూడా కథ చదివాక మనలో కలుగుతుంది. కాని ఇలా చెయ్యమని కథలోంచి రచయిత బయిటికొచ్చి గోలపెట్టడు జంగయ్యగారు. మంచి కథకుడు".

– పురాణం సుబ్రహ్మణ్య శర్మ

విశిష్ట రచన

కొన్ని మంచి పుస్తకాలను చదువుతున్నపుడు చూపులు పంక్తుల వెంట పరుగెడుతున్నాయని, పేజీలు తిప్పుతున్నాయని మనకు స్ఫురించదు. సాక్షాత్తుగా యథార్థ జీవిత దృశ్యాలను చూస్తున్నట్లే ఉంటుంది. 'జాతర' నవల అలాంటింది. రచయిత తీసుకున్నది నల్లగొండ జిల్లాలోని గ్రామీణ ప్రాంతం ఇతర ప్రాంతా పాలిటి చీకటి గది లాంటి ఆ ప్రాంతంలో 'స్విచాన్' చేయగానే వెలిగిన దీపంలా 'జాతర' నవల వెలువడింది. అక్కడి ప్రజా జీవనం దాని మంచి చెడ్డలతో నిమ్నోన్నతాలతో, మేలు కోళ్ళతో దృశ్యమానమైపోయింది. మంచి సాహిత్యాని కింతకంటే కావలసిందేముంది?

అటు సామాజిక విషయపరిజ్ఞానమూ ఇటు శిల్ప మర్మజ్ఞత సమపాళ్ళలో మేళవించిన విశిష్ట రచన - 'జాతర'

- మధురాంతకం రాజారాం

జాతర సజీవ రచన. వాస్తవిక చిత్రణ జీవిత అనుభవం పండిన భావాలు. మర్మస్పృక్కలైన మాటలు. జాతర నాకు నచ్చింది.

జులై 1990
హైద్రాబాద్ ఆచార్య బి. రామరాజు

"జానపదుల అసలైన సిసలైన హృదయం తెలిసిన రచయిత శ్రీ బోయ జంగయ్య, వారి ప్రతి రచన జానపదుల హృదయాలకు నిలిపిన నిలువుటద్దం.

సెప్టెంబర్ 1988 తూమాటి దోణప్ప
హైద్రాబాద్ వైస్ ఛాన్స్‌లర్, తె.వి.వి.

ఈ నవలలో నల్గొండ జిల్లా పల్లె వాతావరణాన్ని సహజ సుందరంగా వెల్లడించిన "జాతర". ఈ నవలలో పాత్రచేత నల్లగొండ జిల్లా ప్రవాస భాషను వాడడం సముచితంగా ఉంది. రచయిత వ్యాఖ్యానాలకు శిష్ట వ్యవహారికాన్ని వాడారు. దీని వల్ల నవలకు చివరంటూ చదివించే గుణం అలవడింది. అంతే కాకుండా శిల్ప నైపుణ్యం పాఠకులను చకితులను చేస్తుంది.

ఉదయం - కాసుల ప్రతాపరెడ్డి

ఆ తరువాత 1990 లో 'దున్న' కథలను ప్రచురించినాము. దానిని మద్రాస్‌లో జరిగిన 'కథా వేదిక' సదస్సులో ఆవిష్కరించాము. ఆ కథల గూర్చి -

1990 ఆగస్టులో మొదటి ముద్రణ, అక్టోబరులో రెండవ ముద్రణ పొందిన ఈ కథా సంపుటికి పరిచయ వాక్యాలు రాస్తూ, 'తెలంగాణా గ్రామీణ వ్యవస్థ, సమస్తమైన దాని లక్షణాలతో అందులో జీవించే దున్నలతో, గొర్రెలతో, నక్కలతో, ఈయన కథలు దర్శనమిస్తాయి. - అన్నారు ప్రముఖ రచయిత డి. రామలింగం.

సీతాకోక చిలుక మందారపు పూరేకుల్లో యిమిడిపోవటం, మాట్లాడితే పూలు చల్లినట్లు వుండడం, దగ్గర అవుతున్న నగరం అరణ్యంలా కనిపించడం, చూపులు మత్తెక్కించే మంత్రాలు, మనుషుల కంటే పక్షులే నయం, సూద్దాం అనకుండ్రి - సేస్తం అనండ్రి. ఊరు నిద్రలేస్తున్న చప్పుడు, - యిటువంటి ప్రయోగాలు కథకునిలోని కవితాత్మకు సూచకాలు.

కథని అల్లడంలో నేర్పు, చెప్పడంలో చాతుర్యం, చదివించడంలో కౌశలం, యితివృత్తంలో నవ్యత, చిత్రణలో రసస్ఫూర్తి గల ఉత్తమ కథా రచయిత బోయ జంగయ్య.

జగతి
ఆగస్టు '91

- దయానిధి

సాహితీ మిత్రులు
నల్లగొండ.

---

"ఎచ్చరిక" కథలు : 15/-
"వెలుతురు" కవితలు : 15/-
"జాతర" నవల : 15/-
"దున్న" కథలు : 15/-
"డా॥ బి.ఆర్. అంబేద్కర్" : 15/-

ప్రతులకు -
బి. చేతన్, H. No. 5-9-14 మాన్యంచెలుక,
నల్లగొండ - 508 001 : ఫోన్ 2515 మరియు
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, హైద్రాబాద్ - 1